వ్యాసం

# బడుగు బతుకులను చిత్రించిన "గంగెద్దు"

అట్టడుగు గంగిరెద్దుల వారి జీవితాలను సెన్సిటైజ్ చేసిన గంగెద్దు కథా విశ్లేషణ...



సాగర్ల సత్తయ్య
79891 17415

తెలుగు కథకు పుట్టిల్లు నల్లగొండ. బండారు అచ్చమాంబ మొదలు నేటి వరకు ఎందరో నల్లగొండ రచయితలు తెలుగు కథను సుసంపన్నం చేశారు. చైతన్యానికి, పోరాటానికి నల్లగొండ పెట్టింది పేరు. ఇక్కడి నుండి తెలంగాణ సాయుధ పోరాట కాలంలో, స్వాతంత్ర్యానంతర కాలంలో ప్రజా సమస్యలను ప్రతిబింబిస్తూ పరిష్కార మార్గాలను చూపుతూ అనేక కథలు వచ్చాయి. తెలంగాణ సాయుధ పోరాట కథలు రాసిన ఆవుల పిచ్చయ్య, కాంచనపల్లి చిన్న వెంకట రామారావు వంటి తొలితరం కథకుల బాటలో ఇటీవల కాలంలో సాయుధ పోరాట కథలు రాసిన వారు భద్రయ్య శీలం. మొట్టమొదటి కథా సంపుటి "లొట్టపీసు పూలు"తో సంచలనమే సృష్టించాడు. ఇటీవల కాలంలో సామాజిక స్పృహతో శరవేగంగా కథలు రాస్తున్న విలక్షణ కథకుడు శీలం భద్రయ్య ఇప్పుడు సాహితీ క్షేత్రంలోకి "గంగెద్దు"ను వదిలాడు.

"గంగెద్దు" కథల్లో మానవ బంధాలు, సామాజిక స్పృహ, మనో విశ్లేషణ, అచ్చమైన సంప్రదాయ జీవన శైలి, జనభాష గొప్పదనం మొదలైన అంశాలను ప్రతిబింబించే కథలు కనిపిస్తాయి. సంకలనానికి తలమానికమైన కథ 'గంగెద్దు'. తలుపు పెట్టి కొడితే పిల్లి కూడా తిరగ బడుతదన్నట్లు అణచివేత అధికమైన చోట తిరుగుబాటు తప్పదని నిరూపిస్తుందీ కథ. ఉండడానికి ఇల్లు, వ్యవసాయానికి భూమిలేని నిరుపేద సంచార జాతులు గంగెద్దుల వాళ్లు. ఊరి బయట గుడిసెలేసుకొని గ్రామాల్లో యాచిస్తూ జీవనం సాగిస్తుంటారు. అంతిమయాత్రలో గంగెద్దులను ఆడిస్తూ పొట్ట పోసుకుంటారు. గంగెద్దుల వారి జీవన విధానాన్ని ఈ కథ కళ్ళకు కట్టింది. కర్ణం పంతులు భార్యకు రోగం వచ్చినప్పుడు గంగెద్ల గట్టయ్య చేసిన వైద్యమే ఆమెను బతికించింది. అందుకు దయతలచి ఆమె ఒక కోడె దూడను ఇచ్చింది. అది అతని మేధా ప్రతిఫలం. అయినా దానిని దానం ఇచ్చినట్లుగానే తన జీవితమంతా కృతజ్ఞతను ప్రకటిస్తాడు గట్టయ్య. తన కడుపున పుట్టిన బిడ్డను సాదుకున్నట్టే ఆ గొడ్డును కూడా సాదుకున్నాడు. అన్ని విద్యలు నేర్పిండు. దురదృష్టవశాత్తు ఆ గంగెద్దు చేతిలోనే మరణించాడు. దిక్కులేని పక్షులైన భార్య ముత్తమ్మ, కొడుకు శివుడు ఆకలితో అల్లాడిపోతారు. గట్టయ్యను పొడిచిన గంగెద్దు పారిపోయి కర్ణం పశువుల కొట్టం లోకి చేరుతుంది. ఆ దారిలో వెళ్తున్న ముత్తమ్మను చూసిన గంగెద్దు ముత్తమ్మను అనుసరించి వెళ్తుంది. అప్పటికి శివుడు గంగెద్దునాడించే నేర్పును కలిగి



గంగెద్దునాడిస్తుంటాడు. ముత్తమ్మ ఎద్దును దొంగిలించిందని, కర్ణం పెద్ద మనుషులతో పంచాయతీకి పిలుస్తాడు. తనకు దానం చేసిన ఎద్దు, తనతో పాటు వచ్చింది. కానీ నేను దొంగిలించలేదని ముత్తమ్మ వాదిస్తుంది. ఆమె చెప్పింది వినకుండా, గడ్డపారను కాల్చి ముత్తమ్మ చేతులతో దూసిపిస్తారు. ఆ సమయంలో పొరుగూరినుండి అక్కడికి వచ్చిన శివుడు గంగెద్దును పెత్తనం చేసే గద్దె మీదకు ఉసి గొలుపుతాడు. అప్పటికే దెబ్బలు తిన్న గంగెద్దు, ప్రతీకారంతో కరణం ప్రాణాలు తీయడంతో కథ ముగుస్తుంది.

కథలో "గంగెద్దు" అన్యాయానికి గురైన పేదవాడికి ప్రతినిధి. ఈ కథ ద్వారా శీలం భద్రయ్య గ్రామీణ ఆధిపత్య సమాజాన్ని, సామాజిక వ్యవస్థలోని లోపాలను మైక్రోస్కోప్ కింద పెట్టి విశ్లేషించాడు. కథ ఉపాధి సమస్యతో మొదలై, భూసమస్యకు పరిష్కారం కావడంతో ముగుస్తుంది. స్వాతంత్ర్య భారతదేశంలో భూసమస్యపై ఎన్నో చట్టాలు వచ్చాయి. మార్క్సిజం పోరాటాలు వచ్చాయి. ఇప్పుడు బహుజన పోరాటాలు నడుస్తున్నాయి. కథలో కరణం పంతులు రంగయ్య, అతని భార్య చాలాకాలంగా విడిపోయి ఉన్నట్లుగా ప్రచారం జరుగుతుంది. వాస్తవానికి భూములను కాపాడుకోవడానికి ఆడిన నాటకమని కొద్దిమందికి మాత్రమే తెలుస్తుంది. గరిష్ఠ భూపరిమితి చట్టాన్ని తప్పించుకోవడానికి పెద్దవాళ్లు ఆడిన నాటకాలకు కరణం ప్రతీకగా కనిపిస్తాడు. సామాన్య జనాలను పశువుకంటే హీనంగా చూసే దుర్మార్గుడు కరణం. "ఆయన మాటలకు తలలూపే పెద్దమనుషుల కంటే గంగెద్దులే నయం" అంటాడు రచయిత. ఉన్నోడికి వత్తాసు పలికే గ్రామపెద్దల తీరును ఈ కథ చక్కగా తెలిపింది. గ్రామంలో ఎవరు చనిపోయినా, కన్నీరు పెట్టే గ్రామీణుల హృదయ మార్దవాన్ని శీలం భద్రయ్య ఈ కథలో చిత్రించారు. స్త్రీపురుష సమానత్వం, ధనిక అగ్రవర్ణాల

**"గంగెద్దు" కథ ద్వారా గ్రామాలలో సామాజిక వివక్ష ఏ స్థాయిలో ఉందో స్పష్టంగా తెలుస్తున్నది. భర్త చనిపోయిన ముత్తమ్మ తన కొడుకుకు బుక్కెడు బువ్వ పెట్టడానికి ఏదైనా పని ఇప్పించమని పంతులును కాళ్ళావేళ్ల పడ్డప్పుడు 'ముత్తమ్మా! కట్టులేని ఊరా? గట్టులేని చెరువానే మనూరు?' అంటూ ఊర్లో అడుక్కునేటోడు కూడా ఉండాలనే పంతులు మాటలు సమాజ దుస్థితిని ప్రతిబింబిస్తున్నాయి.**

కుటుంబాలలో కంటే బీద, అణగారిన వర్గాలలోనే ఎక్కువగా ఉంటుందని ఈ కథను చదవడం ద్వారా అర్థం చేసుకోవచ్చు. సాధారణంగా పురుషులు మాత్రమే గంగెద్దును ఆడిస్తూ ఉంటారు. కానీ తన భార్య తనతోపాటు సుతి పడుతూ ఆటలో పాల్గొనడం ఈ కథలో గమనిస్తాం. గంగెద్దునాడించే పనిలో ముత్తమ్మ కూడా భాగస్వామి కావడం స్త్రీ, పురుష సమానత్వానికి నిదర్శనం. అలాగే ఇది గ్రామీణ శ్రామిక శక్తి, ఉత్పత్తిలో స్త్రీ భాగస్వామ్యాన్ని ప్రతిబింబిస్తుంది.

"పెద్దగంగెద్దును ఆడించినట్లు, ప్రజలు జొన్నలు, బియ్యం పెద్ద ఎత్తున దానం పెట్టినట్లు" కలగన్న శివుడు, ఆ స్థాయి నుండి అతని ఆలోచనలు మర్లబడి నేను గంగెద్దునే ఎందుకు ఆడించాలి? ఊరిజనం కర్ణం పంతులు చెప్పినదానికల్లా ఎందుకు తలాడి స్తుండ్రు? నేను నా ఇష్టమైన పనిని ఎందుకు చేయకూడదు? ఊర్లోవాళ్ళు నాకు వేరే పని ఎందుకివ్వరు? ఊర్లో ఉండడానికి ఇంత జాగా ఎందుకు దొరకదు?" ఇలా తనను తాను ప్రశ్నించుకునే స్థాయికి ఎదగడం సమాజంలోని నేటితరం ఆలోచనా విధానంలో వస్తున్న మార్పుకు నిదర్శనం. మనిషికి ప్రశ్న ఉంటేనే సమాధానం. సమాధానం లేని ప్రశ్నలు సంఘర్షణకు దారితీస్తాయి. సంఘర్షణను అధిగమించడానికి ఆలోచనను ఆయుధంగా మలుచుకుంటాడు. ఆలోచన నుండే ఒక పరిష్కారం లభిస్తుంది. ఇలా ఒక పరిష్కారం వెతుక్కున్న పాత్రలో శివుడు కనిపిస్తాడు.

గ్రామాల్లో వెట్టిచాకిరి, అణచివేతకు వ్యతిరేకంగానే నక్సలిజం వ్యాపించింది. ఈ కథలోనూ ఎర్రకండువాలు గ్రామానికి రావడం, "దున్నేవాడిదే భూమి" నాటకాన్ని ప్రదర్శించడం శివుడి ఆలోచనలు పదును దేరడానికి ఓ కారణం కావచ్చు.

"గంగెద్దు" కథద్వారా గ్రామాలలో సామాజిక వివక్ష ఏ స్థాయిలో ఉందో స్పష్టంగా తెలుస్తున్నది. భర్త చనిపోయిన ముత్తమ్మ తన కొడుకుకు బుక్కెడు బువ్వ పెట్టడానికి ఏదైనా పని ఇప్పించమని పంతులును కాళ్ళావేళ్ల పడ్డప్పుడు 'ముత్తమ్మా! కట్టులేని ఊరా? గట్టులేని చెరువానే మనూరు?' అంటూ ఊర్లో అడుక్కునేటోడు కూడా ఉండాలనే పంతులు మాటలు సమాజ దుస్థితిని ప్రతిబింబిస్తున్నాయి. 'గంగెడ్లోళ్ళు పనికి వస్తే మేము రాము' అనే గ్రామీణ తోటి కూలీల సూటిపోటి మాటలు యాచక కులాలను కనీసం మనుషులుగా చూడలేని దైన్యస్థితిని ప్రతిఫలిస్తున్నాయి.

కథను నడిపించడంలో శీలం భద్రయ్యది అందె వేసిన చేయి. కొన్నిచోట్ల ఆర్ద్రత కల్గిన వాక్యాలు పాఠకుల హృదయాన్ని ద్రవింపచేస్తాయి. తెల్లవారు జామున లేచి ఊళ్లోకి వెళ్లి ముత్తమ్మ పాచిపోయిన బువ్వను అడుక్కొచ్చి పెట్టినప్పుడు 'తల్లే తెల్లబువ్వను చూసి, శివుని కళ్ళు ఎలిగినయి'. అనే వాక్యం చదివాక, ఆ పసిపిల్లవాడు ఆకలితో ఎంత అల్లాడిపోయాడో కదా! అని చదివే పాఠకుడికి హృదయం మెలిపెట్టినట్లు అవుతుంది. గట్టయ్య, ముత్తమ్మ ఇద్దరూ కడుపు మాడ్చుకొని బిడ్డకు, గొడ్డుకు పెట్టి సాదిండ్రు. 'గొడ్డేమో మొగుణ్ణి మింగిపాయె. సద్దాం అన్నా బిడ్డేమో అడ్డమాయె' అనే ముత్తమ్మ మాటలు

కఠినమైన మనసునూ సైతం ద్రవింప చేస్తాయి. 'ఎండకు చెర్ల నీళ్లు, కష్టాల దూపకు ముత్తమ్మ కన్నీళ్లు ఎండిపోయాయి' అన్న రచయిత మాటలు ముత్తమ్మ కుటుంబం దయనీయస్థితికి దర్పణంగా నిలుస్తాయి.

కథాకథనంలో భాగంగా శీలం భద్రయ్య చెప్పిన ప్రతీకాత్మక వాక్యాలు పాఠకులను ఆలోచింపజేస్తాయి. ఒక్కో సారి పిల్లల పొరబాట్లు, దుడుకుతనం తల్లిదండ్రుల చావుకు కారణమవుతాయి. కథలో అదుపుతప్పి రంకె వేసిన "గంగెద్దు" వేగం గట్టయ్య చావుకు కారణమవుతుంది. ఈ సన్నివేశాన్ని వివరించే క్రమంలో 'శివుడు బువ్వ తింటున్న తలెల మట్టి పడ్డది' అనే ఒక వాక్యాన్ని ప్రయోగించారు. బెదిరిపోయిన గంగెద్దు, శివుని మీద నుంచి అమాంతం దుంకి పోతున్న సమయంలో దాని కాలికి తగిలిన శివుని బువ్వగిన్నె దూరంగా పడి, శివుడి బువ్వ మట్టిపాలయ్యిందని చెబుతాడు రచయిత. ఇది భౌతికంగా పాఠకునికి అక్కడ కనిపించే సన్నివేశం. కానీ తన కుటుంబానికి ఆదెరువైన తండ్రిని కోల్పోవడం, తిండి దొరకని స్థితి ఏర్పడడం వంటి దీనస్థితికి ప్రతీకాత్మకంగా 'అతని గిన్నె మట్టిపాలయ్యింది' అని చెప్పడం శీలం భద్రయ్య కథారచనా నిపుణతకు నిదర్శనం. మరొకచోట శివుడు పదహారేళ్ల యువకుడై గంగెద్దును ఆడిస్తున్న సందర్భంలో 'శివుని ఆట సావు ముంగిట సాగుతూనే ఉంది' అంటాడు. ఇక్కడ కూడా అంతిమయాత్ర ముందు శివుడు గంగెద్దును ఆడిస్తున్నాడు అనే సాధారణమైన అర్థంతో పాటు, గంగెద్దును ఆడించడం అంటే మృత్యువుతో పోరాటమే అనే అంతర్లీనమైన అర్థాన్ని కూడా చాకచక్యంగా చెప్పాడు. 'ఎర్ర కండువాలు వచ్చాయి' అనే ప్రతీకాత్మక వాక్యం రాత్రివేళ నక్సలైట్లు గ్రామానికి వచ్చి ప్రజలను చైతన్యం చేయడానికి మీటింగ్‌లు ఏర్పాటు చేశారని చెప్పడమే.

కథాకథనంలో భాగంగా రాసిన వాక్యాల అలంకారిక సౌందర్యం కథకు మరింత వన్నె తెచ్చింది. 'ఆమె ముఖంలో లచ్చిందేవి పొడ, గుట్ట మీది ఎర్ర సూరీడు మాదిరి వెలుగుతూ ఉంది' అనే వాక్యం కర్ణం పంతులు భార్య భౌతికరూపంతో పాటు, ఆమె మంచితనాన్ని కూడా ప్రతిబింబిస్తుంది. మరొకచోట "పడావు పడ్డట్టున్న గడీలు, ఆరోజు రంగురంగుల కొత్తబొంతలను కప్పుకున్న గంగెద్దు లాగా.. గోడలు వీపు మీద తీరొక్క రంగులు వేసుకున్నాయి" అనడం సముచితమైన పోలిక అనిపిస్తుంది. ఇంకోచోట గంగెద్దు గావు పట్టే సన్నివేశంలో "సివంగి మేక మెడను నోట కరిసినట్టు గట్టయ్య మెడను గంగెద్దు అమాంతం నోట కరుసుకుంది." అనే ఉపమానం చక్కని భావచిత్రంలా పాఠకుల కళ్ళ ముందు కనిపిస్తుంది. ఇవే కాక కథ చెప్పే విధానంలో శీలం భద్రయ్య సందర్భాను సారం రాసే కవితాత్మక వాక్యాలు పాఠకులను బాగా ఆకర్షిస్తాయి. "గట్టయ్య తల రౌతుపై పడి, ఆ రౌతు నెత్తురు పులుముకుంది"వంటి వాక్యాలు ఇందుకు నిదర్శనాలు. సంచార అట్టడుగు "గంగెద్దు"ల వారి జీవితాలను సెన్సిటైజ్ చేస్తూ వచ్చినవి ఈ "గంగెద్దు" కథలు.

> **కథలో "గంగెద్దు" అన్యాయానికి గురైన పేదవాడికి ప్రతినిధి. ఈ కథ ద్వారా శీలం భద్రయ్య గ్రామీణ ఆధిపత్య సమాజాన్ని, సామాజిక వ్యవస్థలోని లోపాలను మైక్రోస్కోప్ కింద పెట్టి విశ్లేషించాడు. కథ ఉపాధి సమస్యతో మొదలై, భూసమస్యకు పరిష్కారం కావడంతో ముగుస్తుంది. స్వాతంత్ర్య భారతదేశంలో భూసమస్యపై ఎన్నో చట్టాలు వచ్చాయి. మార్క్సిజం పోరాటాలు వచ్చాయి. ఇప్పుడు బహుజన పోరాటాలు నడుస్తున్నాయి.**

గ్రామీణ ప్రాంతాల్లోని సంస్కృతి, నమ్మకాలు ఈ కథలో చర్చకు వస్తాయి. "గట్టయ్య చెప్పినట్లు గంగెద్దు మాట వినడం వెనుక ఏదో మర్మం దాగి ఉంది." అని ప్రజల నమ్మకం. గంగెద్ల వాళ్లు దాని ముక్కుల, కండ్లల్ల ఏదో చెట్టు పసరు పోస్తారని జనవ్యవహారంలో ఉంది. ఈ నమ్మకాన్ని సందర్భానుసారం కథలో చూపించడం సముచితంగా అనిపించింది. అలాగే గంగెద్దు కాళ్ళను తాంబాలంలో పెట్టి పసుపు నీళ్లతో కడిగి, కుంకుమ పెట్టడంవల్ల చనిపోయిన వారు పుణ్యలోకాలకు వెళ్తారని ఓ నమ్మకం. ఇది కూడా ఈ కథలో కనిపిస్తుంది.

సందర్భానుసారం అనేక సామెతలు గంగెద్దు కథలో కనిపిస్తాయి. "కరణంతో కంటు కాటికి పోయినా తప్పదు." "రాజును పేదనరాదు, ఎద్దును సాధువనరాదు", "చేపకు ఈత నేర్పాలా?", "కట్టులేని ఊరు గట్టులేని చెరువు," "బడితే ఎవడిదో, బర్రె వాడిదే అవుతుందా?," "పేదోని కోపం ప్రాణానికి సేటు," "ఎట్టికి పైస లేదు కానీ, ధర్మానికి దండుగా ...." మొదలైన సామెతలు శీలం భద్రయ్య గ్రామీణ జీవన సునిశిత పరిశీలనకు నిదర్శనాలు.

"గంగెద్దు" కథలో పాత్రోచిత జీవద్భాష పాఠకులను కట్టివేస్తుంది. "పసురం, కుశాలు, ఇబ్రీకం, వశ పడత లేదు, మర్లబడు, బువ్వాల్ల, జరసైసు, తాసీలు ముండ, నామోషి, నామర్ద" మొదలైన అనేక పదాలు తెలంగాణ భాషా సౌందర్యాన్ని ఆవిష్కరిస్తున్నాయి.

శీలం భద్రయ్య గంగెద్దు కథాసంపుటిపై అభిప్రాయం రాయాలనుకున్నప్పుడు ఒక్క కథపైనే ఇంతటి విశ్లేషణ చెప్పవలసి వచ్చింది. ఇక అన్ని కథలపై ఇలాగే రాస్తే అనుశీలన గ్రంథమే అవుతుంది. అంతగా నన్ను ఆకర్షించిన "గంగెద్దు" కథలను తెలుగు కథా ప్రపంచంలోకి సాదరంగా స్వాగతిస్తున్నాను. రచయిత శీలం భద్రయ్యాని మనసారా అభినందిస్తున్నాను.

